# మతానికి మరణశాసనం
# మనిషికి పునరుజ్జీవనం

గోరా

ప్రచురణ

నవయుగ నాస్తిక సమాజం

పిఠాపురం

తూర్పు గోదావరి జిల్లా

## మతానికి మరణశాసనం - మనిషికి పునరుజ్జీవనం

గౌరవ్ @ అమర్

ప్రొమీథియస్ పబ్లికేషన్స్ సారధ్యంలో

ప్రచురణ కాలం : జూలై 2013



ప్రతిపాదిత చందా రూ. 5/-

ప్రతులకు : 90320 94492

* * *

## విజ్ఞప్తి

2007 - 08 కాలంలో నేను ఢిల్లీలో ఉంటున్న సమయంలో రాసిన Epstimological enquiry of Primitive Philosophical evolution నోట్సు ఆధారంగా రచించిన 'తత్వవిచారణ-తర్కవివేచన' లోని మౌలికాంశాల్ని ఇందులో గ్రహించడం జరిగింది. అనేక కారణాల వలన ఆ రచనలు వెలుగు చూడలేదు. అయితే ఈ మధ్య కాలంలో అనేక మతతత్వ సంస్థలతోబాటు కొన్ని ప్రచ్ఛన్న ఆస్తిక సంఘాలు పుట్టుకొస్తున్నాయి. వాటిని ఎదురుకోవడం కూడా ఈ రచన ఉద్దేశంలో భాగమే. నన్ను ప్రోత్సహిస్తున్న కెమెరా విజయ్‌కుమార్ (రాజమండ్రి), యాళ్ళ సూర్య నారాయణ (పార్వతీపురం) డా॥ చైతన్య శేఖర్ (రాజమండ్రి), పి.ఎస్. రవికాంత్ గార్లకు నా కృతజ్ఞతలు. ఆర్థిక - అనారోగ్య కారణాల వలన అనుకున్నంత బాగా రచన రాలేదు. అనేకమార్లు వాక్యాల్ని తిప్పిరాయడం వల్ల స్పష్టత దెబ్బతింది. అందుకు నిస్సందేహంగా నేనే బాధ్యుణ్ణి.



## నామాట

*Unlike a drop of water which loses its identity when it joins the ocean, man does not lose his being in the society in which he lives. Man's life is independent. He is born not for the development of the Society alone. but for the development of his self.*

*- Ambedkar.*

మనిషి పరాధీనతలో నుంచి పుట్టిన రెండు ప్రధానమయిన సమస్యల్ని ప్రస్తావించకుండా భావోద్యమాల గురించి తలబాదుకోవడం గొంగట్లో తింటూ వెంట్రుకలేరుకోడంతో సమానం. అందులో మొదటిది మతం. రెండోది రాజ్యం. సమాజాన్ని బాగుచేయాలనుకునే నిజాయితీకల వ్యక్తుల ఆతృతని అనుభవంతో అధ్యయనం చేసిన పద్ధతిలో పరిశీలిస్తే, ఈ రెండు రోగాల్ని సమూలంగా నయం చేసే ప్రయత్నం చేయకుండా ముందుకు పోలేమనే నిజం త్వరలోనే బోధపడుతుంది.

వ్యక్తి - వ్యవస్థ అవిభాజ్యాలు. సమాజంలో మార్పు కోసం తపించే అభ్యుదయ శక్తుల ప్రయత్నాలకి అర్థం వ్యక్తుల్లో పరివర్తనకి ప్రాథమికంగా పాటు పడడమే తప్పా, వ్యక్తి నుంచి విడదీసి వ్యవస్థని విడిగా సంస్కరించే వంకర పనుల్ని తలపెట్టడం కాదు. మనదేశంలో సగంలోనే ఆగిపోయి, క్రమంగా కనుమరుగైపోతున్న సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాన్ని తిరిగి నిర్మించుకోవలసిన అవసరం, అన్ని వాదాలూ అడుగంటిపోయి, అవకాశవాదానిదే పైచేయిగా నున్న ఈనాటి పరిస్థితుల్లో ఎంతైనా వుంది.

సాంఘిక హితాన్ని కాంక్షించే ప్రగతికర శక్తులన్నీ విభేదాలపై చూపే ఆసక్తిలో అర్థశాతమైనా పురోగమనానికి తోడ్పడే ఐక్యతల విషయంలో చూపి ఉంటే ప్రస్తుత పరిస్థితి కాస్త బాగుండేదని ఆశించడం అత్యాశని అనుకోడం సరికాదు. తొంబై తొమ్మిది శాతం ముఖ్యమయిన అంశాల్లో కలిసి పనిచేయగల అభ్యుదయ శక్తులన్నీ తమ మధ్య స్నేహసంబంధాల్ని హరించే ఆ వందో విషయం కోసం ఎందుకు తన్నుకు చావల్సొస్తోందనేది సమయం వెచ్చించి సమాధానం వెతుక్కోవల్సిన ప్రశ్నగా అనిపిస్తోంది.

అసలాలోచించడానికే, సమయముండడం లేదని వీలయినప్పుడల్లా విధిగా విచారించడాన్నే 'ఆలోచన' గానూ, అనుకున్నదేదీ చేయలేకపోతున్నామని గుర్తుకొచ్చినప్పుడల్లా గందరగోళపడడాన్నే 'ఆచరణ'గా ఎన్నడూ కార్యరంగంలోకి దిగే ప్రయత్నం చేయకుండా కుదిరినన్ని ఎక్కువ పనుల్ని పురమాయించడాన్నే 'నిర్వహణ'గా అనుకుంటూ తమ రోజువారీ అజ్ఞానాన్ని అద్దంలో చూసుకుని మురిసిపోతారు మన సాంఘిక రాజకీయ విప్లవ నాయకులు. వారి దృష్టిలో తాము అనుసరించే ఒంటెద్దు పోకడలన్నీ సైద్ధాంతిక కార్యాచరణలే.

అందుకే అభ్యుదయమనుకుంటూ కేవలం కొన్ని రకాల భావాలకి సంబంధించిన నిర్ధారిత గ్రంథాల్ని పనిగట్టుకు తిరగేయడాన్నే, ఆచరణ అనుకుంటూ నిర్ణీత రూపాల్లో జనాన్ని పోగుచేసుకోడాన్ని మాత్రమే ఉద్యమమనుకోవడం సాధారణమైపోయింది. వ్యవస్థలోని పరాధీనతను ఎత్తిచూపే పనిని నిజాయితీగా తలకెత్తుకోవడంలో అత్యధిక సంఘాలు విఫలమవబట్టే అనూహ్యంగా అమలవుతున్న అజ్ఞానం తరాల్ని కబళించకుండా సామాజిక కార్యకర్తలుగా కాపు కాయాల్సొస్తోంది.

మతాలకి వ్యతిరేకంగా మనుషుల కోసం గొంతు విప్పడాన్ని చులకనగా చూసే వర్తమాన సమాజంలో నిజాయితీతో కూడిన నిబద్ధతకల ప్రయత్నాలు చాలా అవసరం. కొద్దోగొప్పో ఇంకా మిగిలున్న మనుషులంతా మతతత్వానికి విరుద్ధంగా జరుగుతున్న ఈ కృషిలో భాగం పంచుకుని మానుషత్వానికి బాసటగా నిలవడం తమ బాధ్యతే అని విస్మరించినంతకాలం మతోన్మాదానికి మనిషి బలయిపోతూనే ఉంటాడు. అలా కాకుండా ఉండాలంటే ఎన్నటికైనా మతాల్ని తుదముట్టించాలి. అందుకోసమే ఈ యత్నం.

*"Man is a part of society. Society is a part of nature and animate nature is the part of physical universe. Therefore no political practice can guarantee ultimate success unless it is guided by fundamental philosophical principles"*

*- M.N. Roy*



## అంకితం

**"ఎల్ల లోకము ఒక్క ఇల్లై**
**వర్ణభేదము లెల్ల కల్లై**
**మతములన్నియు మాసిపోవును**
**జ్ఞానమొక్కటే నిలిచి వెలుగును"**

అని నినదించిన యుగకర్త
**గురజాడ అప్పారావు**గారికి...

* * *

"మానవుడు అనుసరించడానికి ఆచరించడానికి లోకసంచార తత్వానికి మించిన మంచి మతం మరిలేదు. ఏ జాతి అయినా అభివృద్ధికి రావడం అనేది ఆ జాతిలోని లోకసంచారుల మీదనే ఆధారపడి ఉంటుంది. కనుక యువతీ యువకులందరూ లోక సంచార వ్రతాన్ని దీక్షతో ఆచరించాలి. లోకసంచార తత్వానికి వ్యతిరేకంగా వచ్చే వాదాలన్నింటినీ ధైర్యంతో నిలబడి ఖండించాలి... మానవ జన్మ మళ్ళీ మళ్ళీ లభించదు. యవ్వనమూ మళ్ళీ మళ్ళీ లభించదు. సాహసికులయిన యువతీ యువకులు అవకాశాన్ని జారవిడుచుకోరాదు. భావి లోక సంచారుల్లారా! నడుం కట్టండి! ప్రపంచం మీకు స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉంది."

**- మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయేన్**
లోక సంచార శాస్త్రం

మతం అంటే మార్గం. మనిషికి మంచి దారి చూపడానికి ఉద్దేశించబడింది కాబట్టి, అందుకు నిర్దేశించబడిన మార్గాన్నే మతం అన్నారు. ప్రపంచంలోని మతాలన్నీ మనిషి ప్రాథమిక తత్వచింతన ద్వారానే జనించాయి. ఆయా కాలాల్లో వ్యవస్థీకృతమయిన విధానాలని వ్యతిరేకించిన తిరుగుబాటుదారులంతా ప్రవక్తలుగా కొన్ని నూతన బౌద్ధిక - భౌతిక అంశాలను ప్రతిపాదించి ప్రాపంచిక విప్లవాలకి తమవంతు తోడ్పాటునందించారు. ఆనాటి అనాగరిక ఆదిమ జాతి తెగలకి ఆ అలౌకిక భావనలు కొన్ని విషయాల్లో తోడ్పాటునందించినా, అంతిమంగా అలౌకిక అనాగరికతతో కూడాన అస్తిత్వ పరాయీకరణను అవి ప్రోత్సహించాయి. అదే మతం.

ఒక వ్యక్తికి దేవుడిపై ఉండే నమ్మకం మతం కాదు. మతానికి వ్యక్తి విశ్వాసంతో సంబంధం లేదు. అనాలోచితంగా అమలయ్యే ఆచరణాత్మక అజ్ఞానమే మతం. మానసిక సమతుల్యత లోపించిన మంది జరిపే ఆటవిక తంతులన్నీ ఆదిమ కాలంలో మతాలుగా మనగలిగాయి. గుంపులుగా జీవించే నాటి తెగలకు దైవ విశ్వాసమే ఒక రూపంలో ఉండేది కాదు. అనేకమంది దేవుళ్ళూ, దయ్యాలు, జంతువులు, పశుపక్ష్యాదులు, సరీసృపాలు, ప్రకృతి పరిసరాలు అతీత శక్తులుగా పూజలందుకునేవి. మరణించిన వారి ఆత్మలను గురించి అనేక ప్రచారాలు ఉండేవి. అవన్నీ కలిపి ఆనాటి మతంగా చెప్పవచ్చు.

విశ్వాసం వ్యక్తిగతంగా ఉంటే భక్తి అవుతుంది. సామూహికంగా ఉంటే పిచ్చవుతుంది. ఆ పిచ్చి అలవాటయితే ఆచారంగా మారుతుంది. ఈ రోజు మతాలని మనం అనుకుంటున్నవి ఆలోచించకుండా పాటిస్తున్న ఆరంభ ఆచరణ రూపాలే. మతం అజ్ఞానంలోంచి ఉద్భవించి అసమగ్ర జ్ఞానంతో వ్యవస్థీకృతమైంది. వ్యవస్థీకరించబడిన జ్ఞానం వ్యక్తి స్వేచ్ఛనీ - స్వతంత్రాన్ని నిర్దేశించడానికి ప్రయత్నిస్తుంది. ఆలోచనల్ని అడ్డగించి ఆచరణను నియంత్రిస్తుంది. అదే నియంతృత్వం. మతం ఆరంభ నియంతృత్వానికీ, రాజ్యం ఆధునిక నియంతృత్వానికి పరాకాష్ట. ఈనాటికీ సమాజంలో ఇవి చాలా బలంగా పాతుకొని ఉన్నాయి.

మానవత్వం కోసమంటూ దైవత్వం మిషతో తన కథ మొదలెట్టిన మతం, మతతత్వంతో పశుత్వంగా మారి పురోగమనాన్ని నిరోధించింది. శాంతి సూత్రాలతో రాక్షస నాటకం ఆరంభించిన మతం, తన అశుద్ధాన్నంతట్నీ మనుషులకి బలవంతంగా రుద్ది, హంతక రూపం తీసుకుంది. "There was a time religion ruled the world. It is known as dark ages" అంటాడు హెర్మినెన్స్ గ్రీన్. మతం మనిషిని పాలించడానికి ప్రయత్నించిన కాలాన్ని అంధయుగంగా తప్ప గుర్తించడానికి లేదని విజ్ఞుల భావన.

* * *

సమాజంలోని అసమానతల గురించి అన్యాయాల గురించి, అక్రమాల గురించి ప్రజలు ఆలోచించకుండా ఉండడానికీ, లౌకిక లోపాలను వారెన్నటికీ గుర్తించకుండా వారి దృష్టి మరల్చడానికి మతం చాలా గొప్పగా ఉపయోగపడుతుంది. సంఘంలో కొద్దిమంది మాత్రమే భాగ్యవంతులుగా ఎందుకుండాలనే ప్రశ్న అభాగ్యుల బుర్రల్లోకి రాకుండా చేయడానికి జనాభాలో స్వల్ప శాతమున్న ధనికులకే అధికారం ఎందుకు పరిమితమైందనే సవాలు జనాల మెదళ్ళల్లోకి చొరబడకుండా చూడడానికి, మతమనే ప్రేతాన్ని తప్పనిసరిగా పెంచి పోషిస్తారు పాలకులు.

మానసిక బానిసత్వాన్ని మతం రూపంలో దఫదఫాలుగా ప్రజల్లో ప్రవేశపెట్టి ప్రభుత్వాలకి దాస్యం చేసే గులాంగిరిని వారిపై రుద్దడమే పాలకుల ముఖ్యోద్దేశ్యం. చరిత్రలో ప్రజలు అతీత శక్తుల్ని ఎంతగా విశ్వసిస్తే అంతగా అశక్తులుగా మారి అధికారానికి తలొంచినట్లు తెలుస్తోంది. సమాజంలోని సమస్యలని స్తబ్దతగా స్వీకరించి సమాధాన పడడానికీ, నిత్య జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాల్ని నిర్లిప్తంగా కాంక్షించడానికీ మాత్రమే మత భావనలు పనికొస్తున్నాయి. అందుకే "Religion is excellent stuff for keeping common people quiet." అంటాడు నెపోలియన్.

ప్రజల ఆలోచనల్ని ఆపేసి వారిని భజనపరులుగా మార్చగల ప్రమాదకర అంశం మతం. స్వేచ్ఛకి సమాధికట్టి స్వతంత్రాన్ని నియంత్రించే భయంకర జాఢ్యం మతం. భక్తి ముసుగులో అందమయిన రోగాన్ని దుర్మార్గంగా ప్రసాదించే హీనమైన మౌఢ్యం మతం. మనిషికి మానసిక దుర్బలత్వానికి మతమొక ప్రతీక. మనిషి ఆలోచనా రాహిత్యానికి మతమొక చిహ్నం. మనిషి భావదాస్యానికి మతమొక సంకేతం. "Religion is the master piece of the art of animal training, for it trains people as to how they shall think." అంటూ మతాన్ని జంతువుల శిక్షణ కళగా పేర్కొంటాడు స్కోఫెన్ హెూవర్.

అసలు వ్యక్తిగత అంశమైన విశ్వాసం మతంగా ఎందుకు రూపుదాల్చిందనేది ఆలోచించాలి. వ్యక్తుల్ని నియంత్రించడం ద్వారా వ్యవస్థని పాలించాలనుకునే అక్రమ

మనస్తత్వం మతాల సిద్ధాంతం. ఈరోజు ప్రజాస్వామ్యం పేరుతో చలామణీ అవుతోన్న పార్టీస్వామ్యానికీ మతస్వామ్యానికీ అధికారమే పరమావధి. అసలు మందిలో మూక మనస్తత్వాన్ని పెంపొందించడమే లక్ష్యంగా ఇవి పనిచేస్తుంటాయి. ప్రజల అజ్ఞానానికి పాలకుల అర్ధజ్ఞానాన్ని జోడిస్తే అదే మతమైంది. అందుకే, "Religions are founded on the fear of the many and the cleaverness of the few." అంటాడు స్టెండల్.

* * *

మతం గురించి చర్చించుకునేటప్పుడు దైవచింతనని కూడా పరిశీలించాలి. భక్తి విశ్వాసాలు మనిషి ఆంతరిక భావాలకి సంబంధించినవి. ఆచారాలు ఆర్భాటాలు మాత్రమే భౌతిక కార్యాచరణకు సంబంధించినవి. మతమనే దానికి జన జీవితాల్లో 'మూకుమ్మడి సందడిగా' మాత్రమే పరిచయం. అత్యధిక శాతం మంది చిన్నప్పటి నుంచి నమ్మడానికి అలవాటుపడి భగవంతుడ్ని నమ్ముతారే కాని ఆధారాలుండి కాదు. అలా ప్రశ్నించకుండా నమ్మాలని జీవితంలో పెద్దలనబడేవారిచేత అప్పటికే అనేకసార్లు బోధించుకుని సొంతంగా ఆలోచించలేని స్థితికి వారు చేరతారు.

మతాన్ని వ్యతిరేకించడం అతిపెద్ద సాంఘిక నేరంగా అప్రకటితంగానే అమలవుతోంది. అత్యధిక శాతం మంది అనుసరించేదానిని ప్రశ్నించడం అనేది ధర్మాన్ని ధిక్కరించే ధోరణిలో వ్యవస్థలో ప్రదర్శితమవుతోంది. ప్రజల అనుభూతుల్ని ప్రభావితం చేసే లోతైన మానసిక రుగ్మతగా మతాన్ని అర్థం చేసుకోవాలి. "People accept religion on emotional grounds. One is often told that it is a very wrong thing to attack relgion, because religion makes men virtuous." అంటాడు బెట్రండ్ రస్సెల్ "Why I am not a christian" గ్రంథంలో.

మతాలనేవి మంచిని పెంచడానికేననే వాదన కూడా బలంగా ఉంది. అదెంతవరకూ నిజమో పరిశీలించాలి. మతాలనేవి పుట్టినప్పట్నుంచి వంతులవారీగా ప్రజలకి చేసిన మంచెంతో లెక్క కట్టాలి. మతాలు మనుషుల్ని పాలించినప్పుడు పోయిన ప్రాణాలెన్నో తేలాలి. ఎంతోమంది సత్యాన్వేషకుల్ని వైజ్ఞానికుల్ని అమానుషంగా మట్టుపెట్టిన చరిత్ర మతానిదో శాస్త్రానిదో తేలాలి. ఎన్నడూ ఏ శాస్త్రజ్ఞుడూ, తత్వవేత్త ఏ మతస్తుడిపై దాడి చేయలేదనే నిజం బయటకు రావాలి. లేని దేవుడ్ని నిరంతరం స్తుతించడానికే అంకితమయిన మతాల్ని మనుషులంతా త్యజించాలి.



"I cannot believe in a god who wants to be praised all the time." అంటాడు నీషే. దేవుడి పేరుమీద యుగయుగాలుగా జనాల్ని దోపిడీ చేస్తున్న దొంగలందరూ నిజ జీవితాల్లో ఎలా ప్రవర్తిస్తున్నారో గమనిస్తే భగవంతుడిపై వీరికి గల భక్తెంతో సులువుగానే అవగతమవుతుంది. ఈ రోజు సమాజంలో భాగమయిన వివిధ శాస్త్ర సాంకేతిక పరిజ్ఞాన ఫలితాల్ని ప్రత్యక్షంగా అనుభవిస్తూ అదంతా పైవాడి మహిమేనని గప్పాలు కొట్టే ఈ గడుగ్గాయిలు మనిషి మేధోశ్రమవల్లకానీ, శారీరక శ్రమతో గానీ ఉత్పత్తి చేసిన వేటినీ వాడకుండా ఒక్కరోజైనా గడపగలరేమో ప్రశ్నించండి.

"Religion is something left over from the infancy of our intelligence; it will fade away as we adopt reason and science of our guidelines" అంటాడో వేత్త. విజ్ఞాన శాస్త్ర ఫలితాలయిన సెల్‌ఫోన్లూ, టీవీ, ఇంటర్నెట్, మైకు రికార్డింగులపై ఆధారపడి ప్రచారం చేసుకునే ముచ్చు మతాలన్నీ దేవుడి దయతో అజ్ఞానులకి తెలిసేలా నా వంటి నాస్తికుల మొహం వాచేలా మహిమల మీద ఆధారపడి ప్రచారం చేసుకునే ధైర్యం చేయవెందుకో అర్థం కాదు. కర్మ సిద్ధాంత కథలతో, జన్మ సిద్ధాంత వ్యధలతో కాకమ్మ కబుర్లు చెప్పే మతపెద్దలూ, మత గురువులకి, భగవంతుడు తనని గురించి ప్రచారం చేయడానికిగానూ ప్రత్యేకమయిన పబ్లిసిటీ హక్కులేమైనా ఇచ్చాడేమో తెలీదు. అయితే లెక్కకు మిక్కిలిగా వున్న గుళ్ళూ, గోపురాలు, చర్చిలు, మసీదులు, గురుద్వారాలు ఎందుకనేది ప్రశ్న.

* * *

పైన పేర్కొన్న దుకాణాలన్నీ తమ మతాలకి చెందిన వ్యాపార లావాదేవీల్ని లాభనష్టాల్ని లెక్కలేసుకోడానికి చూపే ఆసక్తిలో, పరమతస్తుల్ని తనలోకి ఆకర్షించడానికి వేసే వేషాల్లో వెయ్యోవంతు సమయాన్ని - శక్తినీ ఏనాడయినా ఏ సామాజిక సమస్యని పరిష్కరించడానికైనా వినియోగించాయా అని ఆలోచిస్తే వాటి అసలు రంగు బయటపడుతుంది. ఇదంతా ఒకెత్తయితే, ఈ మతస్తుల ఆచరణ వ్యవస్థలో ఎలా ఉంటుందో అసంఖ్యాక అలవాట్లకు లోనయిన వ్యసనపరుల్ని గమనిస్తే భక్తి ఫలితమెంతో అర్థమవుతుంది.

"A religion, even if it calls itself a religion of love, must be hard & unloving to those who do not belong to it." అంటాడు ప్రఖ్యాత

మనస్తత్వవేత్త ఫ్రాయిడ్. ప్రేమ తత్వమంటూ, కరుణ రసమంటూ రాలుగాయి మాటలు చెప్పిన ప్రతి మతమూ తనని అనుసరించనివార్ని నిర్దాక్షిణీయంగా అంతం చేయమని బోధించింది. ప్రపంచంలోని ప్రతి మతమూ తనని అంగీకరించని అన్యులపై అసూయని నూరిపోసింది. అవిశ్వాసుల పట్ల అకారణ ద్వేషాన్ని పెంపొందించి మనుషుల మధ్య శత్రుత్వాన్ని చేర్చింది.

కాబట్టి మతాలనేవి నోరు మూసుకుని తమని వెంబడించేవారికి మాత్రమే మార్గాలు. మిగిలిన వారికి దుర్మార్గాలు. పోనీ ఉన్న మతాల్లోని భక్తులయినా సమాజ గమనం కోసం ఏం చేస్తున్నారనే ప్రశ్న వేసుకుంటే అసంతృప్తే మిగులుతుంది. నిత్యావసరాల ధరలు ఎందుకు పెరుగుతున్నాయో, నిత్యం నేరాలు ఎందుకోసం జరుగుతున్నాయో, దరిద్రం ఎందుకు తాండవిస్తోందో, రోజు రోజుకీ మనిషి ఎందుకు దిగజారుతున్నాడో అంచనావేసి చెప్పలేని మత(ద)గురువులందరూ రెడీమేడ్ జవాబులతో ప్రగల్భాలు పలుకుతూ ప్రజలకి పంగనామాలు పెట్టేది తమ కొంపలు నింపుకోడానికే కాని దేవుడిపై గంపెడాశతో కాదు.

దేవుడి పేరుమీద జరిగే తతంగాలన్నింటివల్లా లోకంలో ఏ కొంత మంచి జరగుతున్నా నా ప్రశ్నలన్నింటినీ పునఃపరీక్షించుకుంటాను. అసలు మతం మనిషికి ఏమాత్రమైనా మంచి చేస్తుందని రుజువుచేస్తే, దీక్షల ద్వారానో, తీర్థాల వలనో దీర్ఘకాలికంగా మానవాళిని పట్టిపీడిస్తున్న ఏ ఒక్క సమస్య అయినా పరిష్కరించ బడిందని శాస్త్రీయంగా నిరూపిస్తే నేరస్తులందరికీ శిక్షలు రద్దుచేసి దీక్షలే వేయిద్దాం. ఉద్యోగులందరిచేతా పనులు మాన్పించి ఉపవాసాలే చేయిద్దాం. విద్యార్థులందరిచేతా ఆధ్యాత్మిక పారాయణాల్నే పాఠాలుగా చదివిద్దాం.

మతతత్వం ఎప్పుడయితే పెచ్చుమీరిందో అప్పుడే మానవత్వం మంటకలిసింది. మతస్తులుగా మసలడానికి కావలసిన ముఖ్యమైన అర్హత మనుషులుగా మరణించడమే. మతస్తులుగా మెలగడానికి అవసరమయ్యే ఏకైక యోగ్యత మనుషులుగా మానుషత్వానికి ముగింపు చెప్పడమే. మతస్తుడిగా మారడమంటే మనిషిగా చచ్చి మృగంగా పునర్జన్మించడం. మనిషిని హీనంగా చూసేవారే మతాన్ని అక్కున చేర్చుకోగలరు. మనుషుల ఔన్నత్యాన్ని దిగజార్చాలనుకునేవారే మతాల్ని సమర్థించగలరు. మనిషి దేవుడికి ఎంత ఎక్కువగా అంకితమైతే మనిషిగా అంత తక్కువగా మిలుగుతాడని (The more man puts into gods, the less he remains in himself) మార్క్స్ అందుకే అన్నాడేమో.



* * *

యూరప్‌లో పునరుజ్జీవనోద్యమం (రినైజాన్స్) కారణంగా భక్తనేది యుక్తిపరుల భుక్తికోసం ముక్తిపేరిట జరిగే కుయుక్తిగా తేలింది. మనకి మత సంస్కరణోద్యమాలు జరిగినంతగా మత విమోచనోద్యమాలు జరిగిన చరిత్ర లేదు. ఆ కాస్త జరిగినవి కూడా ఇతరత్రా సామాజికోద్యమాలుగా ప్రభలిన వాటిలో అంతర్భాగంగా అమలయ్యాయే కాని భావవిప్లవోద్యమాలుగా రూపొందలేదు. అయినప్పటికీ అనేకమంది వ్యక్తులు, సంస్థలు భావచైతన్యోద్యమాల్ని పరిమితులతో, వనరులు అనుకూలించినంతలో నిజాయితీగా కొనసాగిస్తుండడం కద్దు.

అన్ని సమాజాల్లోనూ ఆలోచించేవాళ్ళు అల్పంగా ఉండే విషయం ఆశ్చర్యం కాదు. ఆధ్యాత్మికత కొంతమందికి ఆత్మవిశ్వాసాన్ని పెంచే సాధనంగా ఉపయోగపడుతుందనే వాదన కూడా ఒకటుంది. అలాగని అంకితభావం కలిగున్నంతలో అలౌకికత్వాన్ని ఆరాధించే స్వభావం అంగీకరించదగింది కాదు. పాటిస్తున్న వ్యక్తిని బాగున్నంతలో బానిసత్వాన్ని సమర్థించలేం కదా. ప్రస్తుతం మనకి భూలోక బాబాలు - అమ్మలు సైతం అసంఖ్యాకంగా అవతరించారు. శాస్త్ర విజ్ఞానాన్ని కళ్ళప్పగించి చూస్తూ ఆ ప్రవాహ ధాటికి తట్టుకొని నిలబడే చేవలేక, ఇంకే తోవా కానరాక కలికాలమంటూ, కానికాలమంటూ శాపనార్థాలతో సరిపెట్టుకుంటున్నారు.

బస్సులు, రైళ్ళూ, విమానాల్లో తీర్థయాత్రలు చేసేవారు, లౌడ్ స్పీకర్లు లేకపోతే లక్షలాదిమంది భక్తుల ప్రార్థనా గీతాల్ని, పైత్య సంగీతాల్ని వినిపించలేని మతాధిపతులంతా భౌతిక కార్యాచరణలో శాస్త్రాన్ని కాదని బతకలేమనే నిజాన్ని బుర్రలోకెక్కించుకోబట్టే ముక్కు మూసుకుని అడవుల్లో కందమూలాలకి అంకితం కాకుండా ఆధునిక వసతులతో అందమయిన ఆశ్రమాలు నిర్మించుకుని సర్వసుఖాలు అనుభవిస్తున్నారు. మంత్రాలకు చింతకాయలు కాదు కదా చింత చిగురు కూడా రాలదని అర్థం చేసుకున్నారు.

అలా అర్థం చేసుకున్నారు కాబట్టే వారు నమ్మని విషయాల్ని ప్రజలకి చెబుతూ జనాల్ని గొర్రెల్ని చేస్తున్నారు. "All religions with their gods, demi gods, prophets, messiahs and saints are the product of the fancy and credulity of men who have not yet reached the full development and complete possession of their intellectual powers". అంటాడు

బకూనిన్. అసలు దేవుడనే భావనే మనిషి తాత్విక చింతనని తిరోగమన దిశగా మళ్ళించి, మళ్ళీ అతడ్ని పశుప్రాయుడిగా చేయడానికే పనికొచ్చింది తప్ప మరెందుకూ కాదనేది కాదనలేని నిజం.

* * *

"I do not know how to teach philosophy without becoming a disturber of established religion." అంటాడు స్పినోజా. మనిషి తన కోసం తనలాంటి ఇతరులకోసం సమాజంతో మమేకమయి, సమకాలీనులతో సమావేశమయి అందుబాటులోనున్న అన్ని ప్రతిపాదనలను పరిశీలిస్తూ నూతన అంశాల కొరకు కూడా అవిరామంగా అన్వేషిస్తుంటాడు. సాంఘిక సమాగమనం సత్యాసత్య వివేచనాశక్తిని అతడికి అవగతం చేస్తుంది. నియమబద్ధమయిన ప్రకృతి అతడిలోని హేతుత్వాన్ని జాగృతం చేస్తుంది. నిరంతర యోచనాశీలతే వ్యక్తి ఔన్నత్యాన్ని ఇనుమడింపజేసి సత్యానికి అతడ్ని చేరువ చేస్తుంది.

మనిషి భావగమనం అతడు బాగుపడడానికి చేసే యత్నంలో భాగమే. సమాజంలో అత్యధిక శాతం ప్రజలకి హాని కలగనంతవరకూ శాస్త్ర విజ్ఞానాన్ని సర్వజనులకూ సమానంగా అందుబాటులోకి తేవడమే హితవాదుల కుండాల్సిన లక్ష్యం. నేటి కంటే రేపు బాగుండాలని ప్రయత్నించడమే అభ్యుదయం. అందుకు అవాంతరాలుగానున్న మతాల జాడ్యాల్ని మతస్తుల జడత్వాన్ని వొదిలించి నైతిక నాగరిక దశకు వ్యవస్థని నడిపించేలా కృషి చేయడమే మనుషులుగా మనకి మిగిలున్న ఏకైక మజిలీ. "The people have never done anything but pray and pay : We believe that the time has come to make them PHILOSOPHISE" అన్న ప్రౌథాన్ అనే తత్త్వవేత్త వాక్యాల్ని పాటించడానికి ఆచరణాత్మకంగా సిద్ధమవుదాం మనం.

సామాన్య విధానాలకి విరుద్ధంగా చరిత్రలో నమోదైన విప్లవాల మనుగడ ప్రశ్నార్థకమవడానికి సాధారణ ప్రజల ఆలోచనా విధానపు అపరిణితస్థాయి కూడా ఒక ప్రధాన కారణంగా అంగీకరించడానికి మనం ముందుకు రానంతకాలం ఎన్ని తరాలయినా అదే తతంగం పునరావృతమౌతుంటుంది. పౌరుల్లో మూఢత్వం పెంపొందినంత త్వరగా హేతుత్వం పెంపొందదు. అశాస్త్రీయ భావాలు ఆకట్టుకున్నంతలా శాస్త్ర విజ్ఞానం ఆకట్టుకోలేదు. అనాలోచితమయిన అస్తిత్వంలో ఆనందాన్ని



వెతుక్కునే మూఢులకు ఆధ్యాత్మికతలోనూ, మతాచారాల్లోనూ కావల్సినన్ని వింతలూ వికారాలు లభిస్తాయి.

భక్తులుగా మతాలకి, వినియోగదారులుగా వ్యాపార సంస్థలకి, వోట్లేసే పౌరులుగా పాలక ప్రభుత్వాలకి పరాయీకరణ చెంది బతుకీడ్చడం తప్ప సామాన్యులుగా మనకి మరో ప్రత్యామ్నాయం లేదా అని ఆలోచించడం అవసరం. పరాధీనత నుంచి పరిపూర్ణంగా విముక్తి పొంది స్వతంత్ర భావవికాసానికి మానసికంగా సంసిద్ధమయి ముందుకు సాగడం, అమానవీయమయిన మతాలకి స్వస్తిచెప్పి మనుషులుగా మనకో శాస్త్రీయ దృక్పథాన్ని ఏర్పర్చుకుని అంతిమంగా సమాజంలో భావ విప్లవోద్యమాల్ని వృద్ధిచేసే బృహత్కార్యంలో మనవంతు భాగమవడం ఈనాటి చారిత్రక కర్తవ్యం.

**"బతుకు పోరాటము పడకు ఆరాటము**
**బతుకునెంచినపోరు సుతరాము తప్పదు**
**తోసుకుని పోవలయు తోవనీకెవడిచ్చు**
**ఆగిపోవుట చావు - సాగిపోవుట బతుకు."** **- మహాకవి కాళోజి**

* * *

"దేవుడున్నాడని ఒకడూ, లేడని మరొకడు ఎంత గట్టిగా వాదిస్తారంటే, ఆ ఉన్నాడన్నవాడు ఏదో ఆ ఉదయమే వాడూ దేవుడూ కలసి కాఫీ తాగి వచ్చినట్టు మాట్లాడతాడు. ఇక ఆ లేడన్నవాడున్నాడే వాడు ఆ మొదటివాడి తాత. అబ్బే, వాడు లేడండీ, పనిగట్టుకుని వాడెక్కడున్నాడో చూద్దామని అన్ని అడ్రసులూ వెతికి చూసొచ్చా అన్నట్లు వాదిస్తాడు... ఆ మొదటివాడు లోకాన్ని నాశనం చేసాడంటాడు. వాడూ తక్కువవాడు కాడు. వాడు ఈ రెండోవాడే నాశనం చేస్తున్నాడంటాడు. నిజానికి వీరిద్దరూ లోకాన్ని నాశనమూ చేయలేరు, సౌఖ్యనివేశనమూ చేయలేరు. ఎందుచేతనంటే తమకి వాస్తవంగా తెలీని విషయాన్ని తెలిసినట్లు నమ్మి చెప్పే మూఢనమ్మకం ఉన్నవాళ్లు గనుక, వాళ్ళు మెయిన్ స్ప్రింగు లేని గడియారంలా వట్టి డొక్కులు."

**- శేషేంద్ర శర్మ,** నా డైరీ

# ఇంకోమాట

*Men are mortal. So are ideas. An idea needs propagation as much as a plant needs watering. Otherwise both will wither and die.* *- Ambedkar*

నేనో సాధారణ ఆలోచనాపరుడ్ని. సామాన్య ఆచరణావాదిని. అంతకుమించి భావవికాసోద్యమంలో భాగం కావడానికి కావలసిన అర్హతలు, యోగ్యతలు నాకు తెలీదు. ఏ విధమయిన భావ విప్లవోద్యమానికైనా ప్రచారోద్యమమే ప్రదానమని నా భావం. ఒకరికి తెల్సింది ఇతరులకి తెల్పడాన్నే ప్రచారం అంటాం. అంటే సమాచారం అన్నమాట. ఒక నిర్దిష్టమయిన అంశంపై విస్తృత స్థాయిలో జరిగే సమాచారోద్యమాన్నే సంబంధిత సమస్యపై ప్రచారోద్యమంగా నిర్వచించడం తప్పుకాదనుకుంటాను. ప్రచారోద్యమ లక్ష్యం ప్రజాచైతన్యమే.

ప్రతీ ప్రజా సంక్షేమ వాదానికి ప్రచారోద్యమాన్ని మించిన ప్రాథమిక క్షేత్రస్థాయి ఆచరణా కార్యక్రమం లేదు. చైతన్యమంటే వివిధ ఆలోచనారీతులకు సంబంధించిన ప్రాథమిక జ్ఞానాన్ని యోచనాత్మకమయిన చర్చల కోసం సామరస్య వాతావరణంలోకి ప్రవేశపెట్టడమే. మెజారిటీచేత ఆమోదించబడడమే సరయిన సిద్ధాంతానికి ప్రమాణమనే ఆలోచన కూడా హేతుబద్దం కాదు. మతాలన్నింటినీ అందుకే తిరస్కరించాల్సి వచ్చింది. అద్వితీయమయిన తాత్విక ఔన్నత్యంలోని నూతన అంశాల్ని ఆధారం చేసుకుని అనాలోచితంగా తిరస్కరించడమో, అసమగ్రంగా ప్రతిస్పందించడమో భావపరిణితికి ప్రతీక కాదు.

నా రచనలు ఏవయితే ఈనాటిదాకా వెలువరించానో ప్రస్తుతం వాటిలోని అన్ని అభిప్రాయాలతోనూ నేను పూర్తిగా ఏకీభవిస్తున్నానని విజ్ఞులు భావించనక్కర్లేదు. పక్వత పొందని ఆలోచనల్ని అనుసరించడం ఎప్పుడు జరిగిందో అప్పుడే అనాలోచనా తత్వాన్ని ఆరాధించడం సమాజానికి అలవాటయింది. అంతిమంగా ఆలోచన నిర్లక్ష్యం చేయబడింది. వ్యవస్థలో సొంతంగా ఆలోచించగల కొంతమంది సైతం ప్రయత్న పూర్వకంగా మౌనం పాటిస్తుండడం వలన నాలాంటి వారికి రచనా వ్యాసాంగమనేది మేధస్సును ప్రదర్శించుకునే సాధనంగా ఉపయోగపడినంతలా కార్యాచరణని క్రమబద్ధీకరించుకుందుకు కలిసొచ్చే కసరత్తుగా ఉపయోగపడడం లేదు.

అత్యధిక శాతం మందిచేత ఆచారంగా పాటించబడే దానిని విమర్శనాత్మకంగా దర్శించే దృక్కోణం అల్పసంఖ్యాక బుద్ధిజీవుల్లో కొరవడడానికి దోహదం చేసిన కారణాల్ని అన్వేషించకుండా స్వల్పమైన మతిమంతుల అభిప్రాయాల్ని విశ్లేషిస్తూ కాలం గడపడం వ్యక్తిగతంగా తృప్తిపడేందుకైతే సరేకాని వ్యవస్థ కోసమంటూ గప్పాలు



కొట్టుకోవడం సరికాదు. పురోగమించడం కోసమే పుడుతున్న అక్షరాలకి తుదితీర్పులుండవ్. ఏదో నాకు బాగనిపించిన విషయాల్ని ఎదుటివారికి అవి చెప్పడం వలన నాపట్ల వారికి ఉన్నతాభిప్రాయం కలుగుతుందనుకున్న వాటిని కుదిరినన్ని కొత్తపదాలతో పరిచయం చేయడం మూలంగా జరిగిన సాంఘిక కళ్యాణమేదీ నాకు కానరాలేదు. వ్యక్తి ఔన్నత్యానికి అక్షరాడంబరత ప్రమాణం కాదు.

ఏవో తోచిన ప్రగల్భాలు పలకడం మినహా అసాధారణమయిన ఢాంబికంతో సామాన్యుల ముందు విశ్వరూపం ప్రదర్శించుకునేందుకు ప్రయత్నించడం వలన కొద్దో గొప్పో మేధావులనబడేవారికి సైతం సామాజిక సందిగ్ధత గురించిన సందేహాలు అప్రకటితంగా – అంతర్గతంగా అధికమయ్యే పరిస్థితి తలెత్తిందంటే అది అభ్యుదయం ఆచరణా సన్యాసం తీసుకోవడం కారణంగా రూపొందిందే కావచ్చుననేది స్పష్టం. అందుకే అలక్ష్యమయిన ఆలోచనని అదిలించి విలక్షణమయిన ఆచరణవైపు ప్రజానీకాన్ని కదిలించే నూతన శక్తిని జనింపజేయాలి.

మతాల కోసం కాక మనుషుల కోసం, మనుషులకి మంచి చేసే మరో మార్గంకోసం, మనుషుల్ని మనుషులుగా చూసే నవీన ప్రత్యామ్నాయం కోసం ఒక ఉన్నతమయిన మానవతా వ్యవస్థ ఉద్భవించడానికి ఉద్యమ రూపంలో పాటుపడే ప్రజా ప్రస్థానం కోసం ఈ ప్రయత్నం.

ఇది ఫలిస్తుందన్న ఆశతో...

*"Religion, the domination of the human mind; property, the domination of human needs; and government, the domination of human conduct, represent the strongold of man's enslavement and all the horrors it entails."* *- Emma Goldman*

**మళ్ళీ కలుద్దాం**

రచయిత యితర రచనలు

**1) ప్రజాస్వామ్య పతనం**
**2) అరాజకత్వం అంటే ఏమిటి?**
**3) సాంఘిక తత్వం – వైప్లవ మార్గం**
**4) ఒక నాస్తికుడి నామా**
**5) ప్రజాస్వామ్య ప్రస్థానం**
**6) అస్థిత్వం – అరాజకత్వం**
**7) మద్యంపై యుద్ధం**

సుమారు యాభై పైగా ప్రజాహిత కరపత్రాలు

# శాస్త్రీయ విజ్ఞానం – అశాస్త్రీయ అజ్ఞానం

నిత్య జీవితంలో సైన్సు ఫలాన్ని అనుక్షణం అనుభవిస్తూ కూడా నిత్యం మూఢ నమ్మకాలపై ఆధారపడే వ్యాధి వ్యవస్థలో బాగా ముదిరిపోయింది. శాస్త్ర విజ్ఞాన ఆవిష్కరణల ఆసరా లేకుండా కాలు కదపలేని మనం, అశాస్త్రీయంగా ఆలోచిస్తూ అతీత శక్తుల్ని గుడ్డిగా ఆరాధించడానికే అలవాటుపడ్డాం. రాకెట్టు యుగంలో బతుకుతూ కూడా లాకెట్ల మహిమలు నమ్ముతూ సమాజంలోని భావితరాలకు వైజ్ఞానిక ద్రోహం చేస్తున్నాం. దెయ్యాలు, భూతాలు, ఆత్మలు, ప్రేతాత్మల్ని గురించిన అబద్ధపు కథల్నే అందంగా మన వారసులకి అందిస్తున్నాం. వ్యక్తిగత సమస్యలకి రోజువారీ పూజలు, శారీరక రోగాలకి రకరకాల తావీజులు, మానసిక పైత్యాలకి మంత్ర తంత్రాలు, సామాజిక సంక్షోభాలకి స్వామీజీలు – అమ్మలు– బాబాలు, రాజకీయ జారత్వానికి జ్యోతిష్యం, వాస్తు, ఉంగరాలు, వర్షాలకీ – వాతావరణ కాలుష్యానికి కట్టగలిపి ఖరీదైన యజ్ఞయాగాలు... మొదలైన దొంగ వ్యాపారాలన్నీ ప్రజల మానసిక బలహీనతలపై మూకుమ్మడిగా దాడిచేస్తూ రాజ్యమేలుతున్నాయి. ప్రజలు సక్రమంగా ఆలోచించడం ఆరంభిస్తే తమ అస్తిత్వానికి ప్రమాదమని గ్రహించిన పాలకులు అనేక అశాస్త్రీయ అక్రమాలోచనల్ని క్రమబద్ధీకరించి జనాల్లోకి జొప్పిస్తారు. అతీత శక్తుల్ని విశ్వసించేవారెప్పుడూ అశక్తులుగా ఉంటారు. అలాంటివార్ని కుదిరినట్లు ఆడించడానికీ, ఇష్టమొచ్చినట్లు పాలించడానికీ వీలవుతుంది. అందుకే ప్రజల్ని అజ్ఞానులుగా ఉంచి తమ పబ్బం గడుపుకుంటారు సాంఘిక జలగలు. సమాజంలోని అత్యధిక శాతం మందికి అందుబాటులోకి రాని ప్రాథమిక అవసరాలైన తిండి, బట్ట, విద్య, వసతి, ఆరోగ్యం... మొదలైన వాటిని ఎరగా వేసి ప్రజల్లో మానసిక బానిసత్వాన్ని పెంపొందిస్తారు. అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం... అంటూ జనాలకు జంగిలి మనస్తత్వాన్ని అలవాటుచేసి దాన్నే సంఘసేవగా ప్రచారం చేసుకుంటారీ ఆధ్యాత్మిక గుంటనక్కలు. దైనందిన జీవితాల్లో క్షణకాలం సైన్సుగాలి సోకకపోతే విలవిల్లాడిపోయి విగత జీవుల్లా తయారయ్యే మనం శాస్త్రాన్నీ ప్రకృతినీ అధ్యయనం చేయడానికీ, అసమానతలు ఎందుకున్నాయో అర్థం చేసుకోడానికి ప్రయత్నించకుండా అభౌతిక శక్తుల్ని ఆరాధించడం అమానుషం. ప్రశ్నించడం విజ్ఞానానికి, అనుసరించడం అజ్ఞానానికీ ప్రతీక. కాబట్టి ప్రజానీకం, ప్రధానంగా విద్యార్థులూ, యువతా ప్రతీదాన్ని ప్రశ్నించడం నేర్చుకోవాలి. హేతుబద్ధంగా ఆలోచించడం అలవర్చుకోవాలి. శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించుకోవాలి. సక్రమ యోచనా వైఖరిని తర్కబద్ధంగా ఏర్పర్చుకోవాలి. ప్రశ్నే ప్రగతికి మూలం, ముఖ్యం, మార్గం.

ప్రచురణ : **సశాస్త్రీయ ప్రచార సంఘటన,** పిఠాపురం.